# తొలిపలుకు

స్వాతంత్ర్య సిద్ధికి పూర్వమే, 1944 లో, బొంబాయి జాతీయ యువజన సంఘంవారు, ఇంగ్లీషులో ప్రచురించిన జాతీయ పతాక చరిత్రను, ఖమ్మం జాతీయ యువజన సంఘంవారి కోరికపై తెలుగులో అనువదించటం జరిగింది. దాన్ని ఆ సంఘంవారు ప్రచురించారు. ముద్రకులూ, పత్రికలూ, పాఠకలోకమూ సదభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

తదాదిగా, ఈ పుస్తకం ద్వితీయ ముద్రణ పొందుతుందని నేను ఊహించనూ లేదు సరిగదా, ప్రచురించబడాలని అభిలషించను గూడా లేదు. అయితే స్వాతంత్ర్యం పొందిన ఇంత కాలానికి గూడా జాతీయ పతాకాన్ని గురించిన సమగ్రమైన వృత్తాంతాన్ని తెల్పగల పుస్తకంలేని కొరత మాత్రం హృదయాన్ని బాధిస్తూ వున్నది. ఇంతలో తలసనితలంపుగా హైదరాబాదు ప్రభుత్వ సమాజ విద్యా కార్యాలయంవారు. ఈ పుస్తకము ప్రతులు కావలెనని కోరారు. పాత ప్రతులు ఇవ్వటానికి మనస్కరించ లేదు. ఆమూలాగ్రంగా మార్చి, వ్రాయగల వ్యవధీ తీరికా లేక పోయినది. అయినప్పటికీ, స్వాతంత్ర్యావతరణతో వచ్చిన పరిణామాలను దిఙ్మాత్రంగా సూచిస్తూనూ పతాకంపట్ల అనుసరించవలసిన సాధారణ మర్యాదలను తెల్పుతూనూ, కొద్దిపాటి మార్పులను చేర్చాను. అయితే పుస్తకాన్ని పాఠకలోకానికి చాలా అసంతృప్తితో అర్పిస్తున్నాను పాఠకలోకపు ఆదరణతో, మరొక ముద్రణ పొందగలిగితే, ఆమూలాగ్రంగా మార్చి, సచిత్రంగా, అందించ గలనని ఆశిస్తున్నాను. ఇప్పటికీ ఇంతకంటె చేయగలిగింది పని ఏమీ లేక పోయింది

పుస్తకం చివరను చేర్చిన పతాక గీతిక, ప్రభుత్వం అంగీకరించింది గాని, ప్రజలు ఉపయోగించింది గాని కాదు. అది సోదర స్టేటు

కాంగ్రెసు కార్యకర్తలకు, స్వాతంత్ర్య రంగంలో, 1948 అగస్టు 15వ తేదీనాడు పతాక వందనానికి వ్రాశాను అయితే, దీన్ని ప్రచారం చేయ వలెనని నేను తలంచలేదు దీన్ని మిత్రులు శ్రీ పాతూరి నాగభూషణంగారు ఎప్పుడో భద్ర పరిచారు. చక్కని గీతిక వచ్చేవరకు ఇది గుడ్డిలో మెల్లగానైనా ఉపకరించగలదని చేర్చాను.

పునర్ముద్రణకు అవకాశం కల్పించిన సమాజ విద్యాశాఖాధి కారులగు శ్రీ డి. యల్. ఆనందరావుగారికీ, ప్రచురణకు పూనుకొన్న జనపద ప్రచురణల యజమానులకూ, శ్రమయనక ముద్రణ బాధ్యతను వహించిన మిత్రుడు, శ్రీ బి. నాగేశ్వరరావు గారికీ, కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను.

—రచయిత



# జాతీయ పతాకము



అవి వందేమాతర ఉద్యమం దేశమంతటా ముమ్మరంగా చెలరేగిన స్వదేశీ ఉద్యమపు రోజులు. దేశానికి స్వాతంత్ర్యం కావాలనే ఆకాంక్ష ప్రజలందరిలోనూ వెల్లువెత్తసాగింది. ఈ ఆకాంక్షకు ప్రతిబింబంగా భారతజాతికి ఒక ప్రత్యేకపతాకం ఉండవలెననే అభిప్రాయం కొందరు దేశాభిమానులకు తట్టింది. సుప్రసిద్ధ దేశభక్తురాలు శ్రీమతి కామా నాయకత్వంలో కొందరు దేశభక్తులు ప్యారిస్‌లో సమావేశమై ఆకుపచ్చ, కేసరి, ఎరుపురంగులుగల పతాకాన్ని భారత స్వాతంత్ర్య చిహ్నంగా తయారు చేశారు. ఆకుపచ్చభాగంలో పద్మాలు, కేసరిభాగంలో వందేమాతరం అనే అక్షరాలు, ఎరుపుభాగంలో ఎడమవైపు చివర సూర్యుడు, కుడివైపున మధ్యభాగానికి కొద్దిదూరంలో బాలచంద్రుడు చిత్రించబడ్డాయి. ఈ పతాకాన్ని మొట్టమొదటిసారిగా జర్మన్ రాజధానీనగరమైన బెర్లిన్‌లో ఎగురవేశారు. కాని ఆ పతాకం ప్రజల హృదయాలను అంతగా ఆకర్షించలేకపోయింది. చేకూరిన కొద్దిపాటి ప్రజాదరణకూడా బెంగాల్ విభజన ప్రతికూల ఆందోళన జయప్రదంగా ముగియడంతో అంతర్ధానమైంది. 1916వ సంవత్సరంలో శ్రీమతి అనిబిసెంటు నాయకత్వంలో హోంరూల్ ఆందోళన ప్రారంభమైనప్పుడు తిరిగి జండా ఆలోచన ఉద్యమ నాయకుల మనస్సులకు తట్టింది. వారు ఆ ఉద్యమానికి ప్రతిబింబంగా మరొక భారత పతాకాన్ని తయారు చేశారు. అందులో 5 ఎరుపు చారలు, 4 ఆకుపచ్చ చారలు అడ్డంగా వుండేవి. ఎడమవైపున పైభాగంలో ఒక యూనియన్ జాక్, దానిక్రింద సప్తఋషి మండలంలా కనిపించే చుక్కలుండేవి.

ఆజెండాకూడా ఆందోళన ముమ్మరంగా వున్నరోజుల్లో మాత్రమే ప్రజల ఆదరాభిమానాలను పొందగల్గింది. ఈ రెండుపర్యాయాలు ఏర్పరిచిన జెండాలు జాతీయపతాక స్థానాన్ని పొందలేకపోయినవి. ఇందుకుకారణం వందేమాతర ఉద్యమము, హోంరూల్ ఆందోళన లక్షలాది గ్రామీణ ప్రజల వరకు అందలేకపోవడమేనని తోస్తుంది. ఈ రెండు జెండాలలో దేన్ని మనదేశపు ప్రధాన రాజకీయసంస్థయైన భారతజాతీయకాంగ్రెస్ అధికారికంగా గానీ, అనధికార పూర్వకంగాగానీ అంగీకరించలేదు. ఇదికూడా ప్రధాన కారణంకావచ్చు.

జాతీయపతాక రచనకు విశేషంగా శ్రమించి కృషిచేసిన గౌరవం ఆంధ్రులకే దక్కిందని చెప్పవచ్చు. బందరు జాతీయ కళాశాలాధ్యాపకులు శ్రీపింగళి వెంకయ్యగారు ఈ విషయంలో చాలాశ్రమపడ్డారు. వారు దీన్ని గూర్చి 1916వ సంవత్సరంలో ఒక ప్రత్యేక పుస్తకాన్ని రచించి ప్రచురించారు. పంజాబులోని జలంధర్ పట్టణ వాస్తవ్యులైన లాలాహన్స్‌రాజ్ అనే దేశభక్తుడు మహాత్మాగాంధీకి భారతజాతీయపతాకంలో రాట్నానికి స్థానమివ్వవలసిందిగా సూచించారు. శ్రీ పింగళి వెంకయ్యగారిని ఎరుపు, ఆకుపచ్చ రంగులూ, చరఖా చిహ్నముగల ఒక పతాకరూపాన్ని చిత్రించవలసిందని గాంధీజీ కోరగా శ్రీ వెంకయ్యగారు 1921లో కాంగ్రెస్ ఉపయోగించిన జెండారూపాన్ని చిత్రించారు. ఈ సందర్భంలో 1921 ఏప్రిల్ 13 'యంగ్ ఇండియా' పత్రికలో గాంధీజీ ఈ విధంగా వ్రాశారు:

"ప్రతిజాతికి ఒక జెండా అవసరం. లక్షలాది దానికై చచ్చారు. అది ఒక ఆరాధన అనటానికి సందేహంలేదు. దానినాశనం ఘోరమైన పాపం. జెండా ఒకఆశయానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. యూనియన్‌జాక్ ఎగుర

చేసినప్పుడు ప్రతి ఆంగ్లేయుని హృదయంలో గాఢంగా నాటుకొనివున్నకొన్ని భావనలు (Sentiments) ఉత్పన్నమవుతాయి. వాటిశక్తిని కొలవటం కష్టం. చుక్కలూ చారలూ అంటే అమెరికనులకు ఒక ప్రపంచం అన్నమాట.

"మన భారతీయులకు జాతీయపతాకంగా గుర్తింపబడే ఒక పతాకం వుండటం, దానికొరకే బ్రతకటం చావటం అవసరం. బందరు జాతీయ కళాశాలకుచెందిన శ్రీ పి వెంకయ్యగారు కొన్ని సంవత్సరాల తరువాయిగా, ఇతరదేశాల జాతుల జెండాలవివరిస్తూ, మన భారతజాతీయ పతాకానికి రూపురేఖలనుసూచిస్తూ ఒక చిన్న పుస్తకాన్ని ప్రజలకర్పించారు. గత నాల్గు సంవత్సరాలనుంచి ప్రతికాంగ్రెసు సమావేశంలోనూ వెంకయ్యగారు జాతీయ పతాకావసరాన్నిగురించి సూచిస్తూవున్నారు వారి ఈమొక్కవోనిఉత్సాహాన్ని నేనెప్పుడూ ప్రశంసిస్తూనేవున్నాను. ఆయన చిత్రించిన రూపురేఖల్లో జాతిని ఆమూలాగ్రంగా కదల్చివేసేదేమీ నాకుకన్పించలేదు. నాదృష్టివెంటనే ఆకర్షించగల సూచనచేసిన ప్రత్యేకత ఒక పంజాబీకి దక్కింది, జలంధర్‌వాసి అయిన లాలాహంసరాజ్ అనేఆయన రాట్నప్రయోజనాలనుగురించి ప్రసంగిస్తూవున్న సందర్భంలో దానికి జాతీయ పతాకంలో స్థానంవుండాలని సూచించారు ఆయన సూచనలోని స్వతంత్రతను నేను ప్రశంసించకుండా వుండజాలకపోయాను. బెజవాడలో నేను వెంకయ్యగారిని ఎరుపు (హిందూవర్ణము) ఆకుపచ్చ (ముస్లింవర్ణము) రంగులుగలిగి చరఖాపూడ వున్నటువంటి ఒక రూపాన్నిచిత్రించి యివ్వమని అడిగాను. ఆయన ఉత్సాహంవల్ల నాకు మూడుగంటల వ్యవధిలోనే ఒక పతాకం లభించింది అప్పటికి అఖిలభారత కాంగ్రెసు సంఘానికి దానిని సమర్పించటానికి కొద్దిగా ఆలస్యమయింది అట్లా అయినందుకు నేను సంతోషిస్తున్నాను. బాగా ఆలోచించిన తరువాత పతాకవర్ణాలు

హిందూ, ముస్లింలకే కాకుండా ఇతరమతాలకు గూడ ప్రాతినిధ్యం వహించాలని తట్టింది. హిందూ ముస్లిం ఐక్యత ప్రత్యేకశబ్దం కాదు. అది భారత దేశంలో నివసించే అన్నిమతాలవారి ఐకమత్యంలో యిమిడి ఉండటమే కాకుండా దానికి చిహ్నం కూడా హిందువులూ మహమ్మదీయులూ ఒకరినొకరు సహించ గలిగితే ఇద్దరూ కలిసి అన్నిమతాలవారితో తప్పకుండా సహనంతో మెలగుతారు.

ఈ ఐకమత్యం భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ వున్న ఇతర మతాలవారికి ఋడిపింపు కాదు. కాబట్టి నేను జండా మూడు రంగులు గలదిగా వుండవలెనని, తెలుపు, ఆకుపచ్చ, ఎరుపు రంగులు వుండవలెనని సూచించాను. తెలుపు భాగం ఇతర అన్నిధర్మాలకు ప్రాతినిధ్యం వహించగలందులకు ఉద్దేశించబడింది. అత్యంత బలహీనమైనది మొదటిస్థానం ఆక్రమిస్తుంది, ఇస్లాంవర్ణం తరువాత హిందువర్ణమైన ఎరుపు చిట్టచివర, ఈ సూచన బలవంతులు బలహీనుడికి రక్షణగా ఉండాలనే ఉద్దేశించబడింది ఇంతేగాకుండా తెలుపురంగు స్వచ్ఛతకు శాంతికి చిహ్నం కూడా మన జాతీయపతాకం అంటే అంతకు మినహా మరేమీకాదు మనలో అత్యంతసన్నిహితాలకు సమతాభావపు ప్రాతినిధ్యం వహించడానికి మూడు రంగులకూ సమానమైన భాగం నిర్ణయించబడింది.

"రాట్నంమూలంగానే భారతదేశం అంతా ఒకజాతిగా జీవించనూ మరణించనూ గల్గుతుంది. రాట్నం అదృశ్యమయి పోవటంతోపాటు భారతదేశపు సుఖమూ, పురోభివృద్ధీ క్షీణించి పోయినవని ప్రతిస్త్రీ అనుర్దాతో చెపుతుంది. రాట్నపువిలువవల్లనే స్త్రీలు అశేషప్రజానీకము ఇదివరకెన్నడూ పొందనంత జాగృతిపొందారు. ప్రజానీకం ప్రాణదాతను అందులో గుర్తించింది. గాలి, నీరు ఎంత అవసరమో భారతీయ జీవనానికి

రాట్నంగూడా అంతే అవసరం. రాట్నం జాతీయ జీవనమంతటికీ ప్రముఖమైన సమానధర్మం (Common factor) కావటంవల్ల అత్యంత సహజమైంది. దానిద్వారా మనం తిండికీ, గుడ్డకీ సంబంధించినంతమట్టుకు ఇతరులమీద ఆధారపడకుండా సంపూర్ణ స్వతంత్రంగా వుండటానికి కృత నిశ్చయులమై వున్నామని యావత్తు ప్రపంచానికి తెలుపుతాము. నాతోపాటు విశ్వసించేవారంతా త్వరగా తమయింట్లో రాట్నాన్ని ప్రవేశపెట్టుతారనీ నేను సూచించిన పద్ధతినవుండే జాతీయ పతాకాన్ని నెలకొల్పుతారనీ ఆశిస్తున్నాను

"జండా ఖద్దరువస్త్రంతో మాత్రమే చేయబడవలెనని వేరేచెప్పనవసరంలేదు. ముతకగుడ్డవల్లనే ఇతరదేశాల బట్టల అంగళ్లనుంచి మన దేశాన్ని స్వతంత్రం చేయగలుగుతాము. అన్ని మతసంస్థలకూ, వారు నావాదనను అంగీకరిస్తే ధార్మికపతాకాలలో ఎడమవైపు పైభాగాన చిన్నపరిమాణంలో జాతీయపతాకాన్ని చిత్రించవలసినదిగా సలహాయిస్తాను. పతాక పరిమాణానికి తగినట్లు రాట్నస్వరూపం పూర్తిసైజులో చిత్రించబడివుండాలి."

గాంధీజీ తానుసూచించిన ఈ జండాను జాతీయపతాకంగా అంగీకరించమని కాంగ్రెసుకు సలహాయివ్వటానికి సంసిద్ధులైవుండగానే పంజాబులోని సిక్కులీగువారు తమ నల్లరంగునుగూడా అందులో చేర్చమనికోరుతూ ఒకతీర్మానంచేశారు. గాంధీజీ అనేక కారణాలవల్ల దీనికి అభ్యంతరం తెలిపారు. వారు సిక్కులీగుకుయిచ్చిన ఈ దిగువ ప్రత్యుత్తరంలో అదంతావిస్పష్టంగావున్నది.

"సిక్కుమిత్రులు ప్రతిపాదితమైన జాతీయ పతాకంలోని రంగుల విషయమై అనవసరంగా ఆందోళనచేశారు. వారి సైనిక ప్రాముఖ్యత

కారణంగా నల్లరంగునుకూడా అందులో చేర్చమని కోరుతున్నారు. వారి వాదనలోని మంచి ఉట్లావుండగా ఆ జండా అఖిలభారతకాంగ్రెసు కమిటీలోకి చర్చకూ నిర్ణయానికీ రానప్పుడు వారి ఆందోళనకు అర్థమేలేదు. వారి ఆభ్యంతరాన్ని దృష్టిలోవుంచుకొని వారి వాంఛలోని హేతుసాహిత్యాన్ని వారిచే అంగీకరింపజేసేటంతవరకు దానిని కమిటీముందుకే తీసుకొనిరాకుండా వుంచటానికై నిశ్చయించుకున్నాను. తెలుపులో ఇతర అన్నివర్ణాలు యిమిడివున్నాయి. సమానభాగంలో ప్రత్యేక ప్రాముఖ్యానికై అడిగేటమంటే రెండుపెద్దజాతులతో కలియకపోవటమన్నమాట. హిందూ, మహమ్మదీయులలో తగవులు లేకపోయినట్లయితే నేను ఒకచేరంగు వుండవలెననే వాడిని సిక్కులకెన్నడూ హిందువులతో భేదంరాలేదు. వారికి ముసల్మానులతోవచ్చిన కలహాలుగూడా హిందువులకు వచ్చినటువంటివే. మనలో మనకుగల విభేదాలను, వ్యత్యాసాలను, గోరంతలను కొండంతలుచెయ్యటం ప్రమాదకరమైన విషయం. పరస్పరసంబంధాన్ని దృఢపరచుకొనే మార్గాలను వెతకాలి. నాకు సిక్కుజాతీయవాదుల కష్టాలు తెలుసు. సిక్కులలోవున్న ప్రభుత్వపు ఏజంట్లు వైరుధ్యాన్ని పురికొల్పేందుకు అన్నివిధాలైన కుటిల సూచనలను చేస్తున్నారు. వారు సహజంగానే భయపడుతూ వుంటారు. ఆందోళన పడకపోవటం అన్నిటికన్నా ఉత్తమమైంది. హిందువులకూ, ముసల్మానులకూ, లేదా సాధారణంగా అసహాయోద్యమానికి ప్రతికక్షులు కష్టాలను కల్పించటం సహజం. వాటిని చక్కబరచటానికి పూనుకున్నట్లయితే ప్రతికూల వాతావరణం కల్పించేవారికి విల్వ తావుండదని గ్రహించగల్గుతారు. సిక్కుజాతీయవాదులు అల్పసంఖ్యాకులుగావున్నా అధికసంఖ్యాకులుగా వున్నా తమ ఆత్మవిశ్వాసాన్ని తెలుసుకొని రంధ్రాన్వేషకులుచెప్పే ఏవిషయానికీ చలించకుండా నిశ్చలంగావుండాలి."

గాంధీజీ సిక్కు లీగుకిచ్చిన ప్రత్యుత్తరంలో చెప్పినట్లుగానే పతాక సమస్యను అఖిల భారత కాంగ్రెసు సంఘం ముందుకు తీసుకోరాలేదు.. అయినప్పటికి మహాత్మాగాంధీలాంటి మరో వ్యక్తి ప్రతిపాదించిన జండా త్వరితంగా ప్రజామోదాన్ని పొందగల్గింది. కాంగ్రెసు సభలన్నిటిలోను ఇతర జాతీయ సమ్మేళనాలలోను, సమావేశాలలోను నానాటికి అధికంగా ఉపయోగింపబడుతూ వచ్చింది. అసలు గాంధీజీ ముస్లిం మనస్తత్వాన్ని అనుకూలించేటందుకు జండాలోని రంగులను మత చిహ్నాలుగా సూచించినప్పటికీ ఆయనస్వయంగా వాటిని శాంతికి సత్యానికీ, అహింసకు చిహ్నాలుగా విశ్వసించారు. "పతాక సంరక్షణకై సంతోషంగా అమరణాంతరం బాధలను భరించే పాటి స్థితికి స్వేచ్ఛాత్యాగాల విషయంలో ముందుకువచ్చామని విశ్వసిస్తూ" ఆయన దానిని మనకిచ్చాడు. ఆ సందర్భంలో ఆయన ఈ దిగువ సందేశాన్ని దేశం నలుమూలలూ అందించారు. "ఇప్పుడు జాతీయపతాకం దేనికిచిహ్నం? అది జాతిసమిష్టి గౌరవానికి ప్రతిబింబం, ఒకజాతి ఆ జాతి ప్రజానీకమంతా పతాకరక్షణకై ప్రాణాలర్పించటానికి సిద్ధంగా వున్నప్పుడే ఆ జాతికి ఒక పతాకార్హత వస్తుంది. అన్నిజాతీయపతాకాలు వారి త్యాగసంసిద్ధతకు చిహ్నాలు." ఇంగ్లండు యూనియన్ జాక్, అమెరికా సంయుక్త రాష్ట్రాల చుక్కలూ, బారలూ, జర్మనీ స్వస్తిక్, జపాను ఉదయభానుడూ, అన్నీవారివారి జాతులకై బాధలనుభవించటానికి ఆయాజాతుల సంసిద్ధతల తెలుపుచిహ్నాలే. మన జాతీయ పతాకం గూడా స్వతంత్రానికి పోరాడటానికీ, అవసరమైతే దేశగౌరవం నిమిత్తం చావటానికీ సంసిద్ధతను సూచించాలె. అలంకారార్థముపయోగించే అందమైన రంగుగుడ్డపేలికగా దీనిని పరిగణిస్తే జండావుండటంలో అర్థంలేదు. పురుషులు, స్త్రీలు, చివరకు పిల్లలుగూడా దానిగౌరవాన్ని రక్షించటానికి సంసిద్ధులైవుండాలె," గాంధీజీ బహూకరించిన

ఈ పతాకాన్ని సంరక్షించేటందుకు వేలకొద్ది ప్రజలు ముందుకు వచ్చారు. పతాకానికై మొట్టమొదటి గొప్పపోరాటం నాగపూరులో జరిగింది. దానినే మనం నాగపూరు జండా సత్యాగ్రహమంటాము.

ఈ సంఘటన 1 మే 1923 సం॥న నాగపూరు పురవీధులలోనుండి జాతీయపతాకాన్ని తీసుకొనిపోతూవున్న ఒక ఊరేగింపుపై 144 సెక్షను ప్రయోగించి పోలీసులు అభ్యంతరపరచినమూలంగా ఏర్పడింది. స్వచ్ఛంద సేవకులు తాము సంకల్పించిన చోటుకు జాతీయపతాకాన్ని తీసుకొనిపోయే హక్కు తమకు వున్నదని పట్టుబట్టారు. వారు నిర్బంధించబడి శిక్షింపబడ్డారు. సత్యాగ్రహసందర్భంలో మొదటిసారిగా నిర్బంధానికి గురియైనది "సుభద్రాదేవి" యను పేరుగల ఒక స్వచ్ఛందసేవిక. ఆమె అలహాబాదు ప్రభుత్వపాఠశాలలో విద్యఅభ్యసిస్తూవున్న యువతి. కాంగ్రెసు అసహాయోద్యమపు పిలుపు యిచ్చేవరకు ఆమె పాఠశాలవదలిపెట్టి కాశీదివ్యజ్ఞానసమాజ పాఠశాలలో చేరింది. కాని అదికూడా ఆమె భావాలకు అనుకూలంగా లేనందువల్ల వదలివేసింది. తరువాత నాగపూరులో ఒంటరిగా సగర్వంగా చేతుల్లో జాతీయపతాకాన్ని ధరించిపోతూవుండగా నిర్బంధించబడింది. ఆమె అరెస్టుతరువాత 31 మే 1923 న నాగపూరులో జరిగిన బహిరంగసభలో "రాజాజీ" స్మరణీయమైన తన ఉపన్యాసంలో జండా సత్యాగ్రహ ప్రాముఖ్యతను నొక్కిచెప్పుతూ జండాలు ధరించిన ఒంటరి వాలంటీర్లను అరెస్టుచేసి తమచట్టానికి తామే వ్యతిరేకంగా ప్రవర్తించినందుకు ప్రభుత్వాన్ని తీవ్రంగా ఖండించారు. జండా సత్యాగ్రహోద్యమాన్ని హృదయపూర్వకంగా బలపరచవలసినదిగా ఆయన ప్రేక్షకులను ఉద్బోధించారు. రాజాజీ ఉపన్యాసంలోని కొన్నివాక్యాలు ఈ దిగువ ఉదహరిస్తున్నాము.

"మీ నగరంలో ఒక తీవ్ర సంఘర్షణ జరుగుతూవున్నది. అ. భా. కాం. కమిటీతీర్మానం యావద్దేశ్యపు దృష్టిని ఈవైపుకు మరల్చింది. ఏదో కొద్దిమంది వ్యక్తులు చేతులో గుడ్డపేలికను ధరించి దానికై అరెస్టుకావటం ఇదేమంత పెద్ద సంగతికాదని, అందుకై దానికి ఏమంత ఎక్కువ ప్రాముఖ్యత లేదని చాలామంది మిత్రులు అనుకొంటున్నారు. జాతీయపతాక సంఘర్షణ ప్రధానమైంది, అవునా, కాదా? అని సందేహించవలసినవిషయమా? ఘనమైన బ్రిటీషుప్రభుత్వపు అధికారులు ఈ స్థలంలో ఈ అవ్యక్తసంఘర్షణకై ఉదయంనుంచి సాయంత్రంవరకు పడిగాపులు పడివున్నారంటే దీనివల్లనే వాస్తవమేమిటో మీరు నిర్ణయించవచ్చు. వారు ఏమితెలియని ఈ వాలంటీర్లు మూడురంగుల ఖద్దరుగుడ్డపేలికను ధరించివస్తుంటే వారికై కనిపెట్టుకోవటంలో తమ విలువైన సమయాన్ని ఎందుకు వ్యర్థపుచ్చుతారు? వారెందుకు వాలంటీర్లను జండాతోపోనివ్వరు? మనవల్ల ఆజ్ఞాపింపబడ్డట్టుగా ఎందుకు ఆ స్థలంలో ఓపికగా కనిపెట్టుకొని చూచుంటారు? ఈ సంఘర్షణను విన్నా నేడూ నేనుచూస్తున్నాను. నేను జాగ్రత్తగా కనిపెట్టుతున్నాను గూడ. తమ సమయపు విలువనుగుర్తించిన ఇంతపెద్దఅధికార్లు అప్రధానంగా కనిపించే ఈయుద్ధంకోసం ఎందుకు కనిపెట్టుకొని వుంటారని నేను నామనస్సులో ఆలోచిస్తున్నాను. నేనువారిని, సినిమాకో, నాటకానికో రమ్మంటే వారువచ్చేవారా? కాని వారు కనిపెట్టుకొనివుండి మనంపంపే స్వచ్ఛంద సేవకులను తీసుకపోవటం తాము వారుప్రభుత్వంనుంచి పొందుతూవున్న పెద్దపెద్ద జీతాలకు సరిపోయినపని అని అనుకుంటున్నారు."

"కాబట్టి మనలోకొంతమంది ఈ సంఘర్షణ ప్రాధాన్యతను గుర్తించనప్పటికీ కనీసం ప్రభుత్వోద్యోగులైనా తెలుసుకున్నారు. వారుకేవలం కాలక్షేపానికి వారిసమయాన్ని వ్యర్థపరుస్తారని ఊహించకండి. వారుప్రభుత్వ

ఆజ్ఞలప్రకారమే అలాచేస్తారు కాబట్టి ఘనమైన ఆ తెల్లప్రభుత్వం వాన్ని ప్రధానంగా తలుస్తున్నది. తెల్లవారూ, వారిప్రభుత్వమూ ఇండా అంటే ఏమిటో ఎరుగుదురు. అరచేతిఅంతమబ్బు క్షణంలో ఏవిధంగా ప్రవహించ కల్గుతుందో వారికితెలుసు కాబట్టి ప్రభుత్వ ఆజ్ఞకు విరుద్ధంగా జాతీయపతా కాన్ని ఒకదానితరువాత ఒకజట్టుగాపోయే మన స్వచ్ఛంద సేవక దళాలకై ఈ ఎర్రటిఎండలో వేచివుండటానికిని వేలకొద్ది రూపాయలు జీతాలుగా తినే అధికారులను ఈ డ్యూటీపైన ఉంచటం తగిన పని అనుకున్నారు. వారు స్వరాజ్య యుద్ధం యావత్తూ ఇందులోనే ఉన్నదని ఎరుగుదురు. అంటే పరదేశీయ ప్రభుత్వపు ఆజ్ఞలన్నిటికీ భయపడి శిరసావహించడమూ, లేదా, మన ఇచ్ఛా ప్రకారం శిరసావహించడం, శిరసావహించక పోవడమూ అనేదానిలోనే స్వరాజ్య సమరం ఇమిడియున్నదని వారికి తెలుసు మార్పు లేని ప్రకృతి సిద్ధాంతాలమోస్తరు ఆ ప్రభుత్వ ఆజ్ఞలను శిరసావహించినంత సేపు మనం బానిసలము. మనం ఇష్టంవస్తే వింటాము. ఇష్టంలేకపోతే వినము. అంటే స్వతంత్రులమై పోయినాము. ప్రభుత్వం చట్టాలను ఏర్పరచింది. కాని దాదాపు వాటిని తప్పినడుస్తున్నది ఈ విధంగా ఈ చట్టాలను దురుపయోగం చేయడంవల్ల వారు అంతకంటే మించినశాసనాన్ని అంటే ప్రజాసంకల్పాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. ఈ శాసన దురుప యోగం దేశమంతట అత్యధికమైపోయింది. అందువల్ల ప్రజానీకం దానికి వ్యతిరేకంగా తమ సంయుక్త సంకల్పాన్ని పురోగమింపచేస్తూ శాసనాలను తృణీకరించవలసిన సమయం ఇప్పటికే మించిపోయింది 144వ సెక్షనూ, దాని ఉద్దేశ్యానికీ, అర్థానికీ వ్యతిరేకంగా దురుపయోగపరచిన సందర్భాలు ఎన్ననిచెప్పమంటారు. ఇప్పటివరకు ఈ అస్పష్టశాసనాలను, నిషేధాలను మనం అనుసరించాము. ఉల్లంఘించినది కదాచిత్‌గా మాత్రమే మనం

న్యాయానికీ, సత్యానికీ, అన్నులపై ఈ శాసనాలు ఉల్లంఘించినట్లయితే ప్రభుత్వం తమ శాసనాలకంటే అధికమైన ప్రజావాంఛకు లొంగిపోవలసివస్తుందని మీకూ, ప్రభుత్వానికీగూడా నమ్మకం పురికొల్పుతున్నాను. ప్రతి రాష్ట్రానికీ, ప్రతివ్యక్తికీ, ఈ శాసన వ్యభిచారాన్ని నిరోధించే హక్కువున్నది. వ్యభిచారం అనేది చాలా కఠినమైనపదం. కాని నేను మీకు వివరించి చెప్పటానికి అవసరమయ్యేటంత ఘోరమైనదికాదది. జండా చేతిలోవున్న ఒంటరి మనిషిని అరెస్టుచేయటమంటే అర్థమేమిటి? ఒంటరిమనిషే ఒక ఊరేగింపా? ఇది శాసనమా: శాసన వ్యభిచారమా? వాస్తవంగా ఒకపురుషుడుగాని స్త్రీగాని జండాతీసుకొని నడచినంతమాత్రాన నామిత్రులకు అంటే రోడ్డు అవతల ప్రక్కవున్న ఆంగ్లేయులకు శాంతిభంగానికి దారితీస్తుందని నూరుమంది మేజస్ట్రీటులు ప్రమాణం చేసినప్పటికీ నేను విశ్వసించజాలను. ఏ నాగపూరు రెసిడెంటునైనా సాక్షిబోనులో కెక్కించుతే అతడు ఇట్లాంటి చిలిపిపని తానుచేయననిబొబ్బాలమిస్తాడని నాకుతెలుసు. అయినప్పటికీ కావలెనని దానికే సిద్ధమయి ఈ ఉత్తరవు జారీచేయబడింది. దీన్ని నేను శాసన వ్యభిచారమంటాను.

"అసలు రహస్యమేమిటంటే ప్రభుత్వానికి ఈపతాకంలో మూడు రంగులు కలియటం యిష్టంలేదు. ప్రత్యేకంగా ఒకవ్యక్తి క్రైస్తవుడో, పార్శియో, తెల్లజండా పట్టుకుంటేగాని, ఒకహిందువు ఎర్రజండాపట్టుకుంటే గాని, ఒకముసల్మాను ఆకుపచ్చజండా పట్టుకుంటేగాని ప్రభుత్వం కలుగజేసుకోకపోయేది. ఒకవేళ హిందువులు, క్రైస్తవులు, యూదులు, ముసల్మానులు తోవలో ఒకరితోఒకరు పోట్లాడుకుంటూవుంటే అది ప్రభుత్వానికి అధికసంతోషం కలిగించేది కాని ఈ అన్నిరంగులు ఒకేజండాలో చేర్చేటప్పటికి బ్రిటీషుసామ్రాజ్యానికి ఒకపెద్ద అపాయమైంది, ప్రజలను చిక్కు

లలో పెట్టడానికి వాలంటీర్లతో పోట్లాడటానికి వారు చాలాకాలముగ్రిందట మరోవుద్దేశ్యంతో చేసిన ఈ చిన్నశాసనాన్ని దురుపయోగపరచారు. కొంత మంది దీన్ని జాతీయపతాకం అనడం ఎంతవరకు క్రమమైందని ప్రశ్నిస్తారు. ప్రభుత్వం దీనిని గుర్తించి దీనితో పోట్లాడుతున్నది. పతాకం యుద్ధానికి చిహ్నాం. శత్రువుగుర్తించినప్పుడు అది పతాకమవుతుంది. మీరు చిహ్నాం వైపుచూస్తే మనం ఏవిధమైనయుద్ధాన్ని ప్రతిపాదిస్తున్నామో తెలుస్తుంది. మీరు మనజండాపైన చరఖా తప్ప ఒక పులిని కాని, సింహాన్ని కాని లేక ఏ క్రూరమృగాన్ని కాని చూడరు పరిశ్రమకూ, సుహృదయతకూ పశుబలంతో పోరాడే మనక్రొత్తవిధానానికి అది ప్రాతినిధ్యం వహిస్తుంది. మనం చరఖాకు బదులు తుపాకి చిహ్నాన్ని ఏర్పరచి యున్నట్టయితే, అంతకంటె పెద్దతుపాకి వున్న ప్రభుత్వం దాన్ని లెక్కపెట్టకపోయేది. కాని రాట్నము 30 కోట్ల రాట్నాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నది. ప్రభుత్వం ఆ బలానికి తట్టుకో లేదు. కాబట్టిమీరు ఈ శాసన దురుపయోగం విలిపివేసేవరకు పోరాటం కొనసాగిస్తే విజయంపొందగలమని నాకు గట్టినమ్మకం వున్నది."

*నాగపూరుజండా సత్యాగ్రహం కాంగ్రెసు కార్యసంఘం ఆశీర్వాదాన్ని, ఆతరువాత 8, 9, 10, జూలై 1923 నాగపూరులో జరిగిన అ. భా. కాం. క. ఆశీర్వాదాన్నిపొందడంతో ఒక ఉద్యమంగామారింది, నాగపూరు సత్యాగ్రహ కమిటీకి, ఉద్యమాన్ని జయప్రదంగా కొనసాగించటానికి సర్వశక్తులాసహాయ పడవలెనని కమిటీతీర్మానం జరిగింది. అంతే, రాబోయే "గాంధీరోజు"ను

* డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్ర నుండి.

పతాక దినంగా అనుష్ఠించటానికి తీర్మానించింది. రాష్ట్రీయ కమిటీలను పతాకోత్సవాలను, బహిరంగ ప్రతిష్ఠలను ఏర్పాటుచేయటానికి కోరుతూ సిఫార్సుచేయబడింది. ఈ సమయంలో ఈ సత్యాగ్రహ సందర్భాన్నే శ్రీ జమ్నాలాల్ బజాజ్ కూడా అరెస్టుఅయినాడు. అఖిలభారత కాంగ్రెసు సమితి నాగపూరులోసమావేశం కావటానికి ఆదేశించింది. కమిటీ ఆయన నిర్బంధ సందర్భంలో బజాజ్‌జీకి ధన్యవాదాలు తెలిపింది. ఉద్యమాన్ని తాను హృదయపూర్వకంగా బలపరుస్తున్నదనే విశ్వాసాన్ని ప్రకటించింది. ఆయన 3000 రూపాయిలజరిమానానురాబట్టుకోటానికి ఆయనకారును ప్రభుత్వం జప్తు చేసింది. కాని నాగపూరులో అది అమ్ముడుపోలేదు. చివరకు దానిని అమ్మడానికి కథియవాడ తీసుకోపోవలసి వచ్చింది.

* పాఠకులకు కథియవాడ్ దనక దీనిని ఎందుకు తీసుకపోవలసి వచ్చిందో తెలుసుకోవాలనే కుతూహలం వుండవచ్చు. కథియవాడ చిన్న చిన్న భారతసంస్థానాలతో గూడిన మనదేశంలోని ఒకభాగం. వీరూ, తదితర సంస్థానాధిపతులూ బ్రిటనుకు భారతదేశంలోని పంచమాంగదళం అని ఎవరో చాలాబాగా చెప్పారు. వారు తమ యజమానుల ఆజ్ఞను తలదాల్చటానికెప్పుడూ సిద్ధమే. ఇది వారికి సులభతరమైన కార్యం, ముఖ్యంగా అది తమ యజమాని ప్రతిష్ఠకు సంబంధించినది అన్న సందర్భంలో. కార్య సంఘమూ అ. భా. కాం. పిలుపుల ప్రకారం ఈ ఉద్యమాన్ని బలపరచ

* మహాత్మాగాంధీకి 18 మార్చి 1922 న 6 సంవత్సరముల విడిఖైదు విధించబడింది. దేశమంతా ప్రతినెలా 18 వ తేదీన గాంధీరోజుగా ఆయన తిరిగి 1924 లో విడుదలఅయ్యేవర్యంతం పరిగణించి అనుష్ఠించింది.

* ఇది డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్రనుంచి.

దానికి అన్నిరాష్ట్రాలనుంచి సత్యాగ్రహానికి నాగపూరుకువచ్చిన సత్యాగ్రహుల బాధలు విపరీతమైనవి నాగపూరు సత్యాగ్రహం త్వరలోనే అఖిలభారతోద్య మంగా పరిణమించింది. శ్రీ వల్లభభాయ్ పటేలు 10 జూలై నుంచి దాని నిర్వాహకుడుగా నియోగింపబడ్డాడు. స్వచ్ఛంద సేవకులు భారతదేశ అనేక ప్రాంతములనుంచి పంపబడ్డారు కొన్నికాంగ్రెసు కమిటీలు విధికై విజ్ఞప్తి చేసినవి కార్యసంఘము అగస్టు మొదటిరోజులలో విశాఖపట్టణంలో సమావేశమయి శ్రీ విఠల్‌భాయి పటేలు, నాగపూరు సత్యాగ్రహాన్ని నిర్వ హించడంలో చేసిన సహాయాన్ని కృతజ్ఞతా పూర్వకంగా అభినందిస్తూ అయనను తన సోదరునితోపాటు మార్గదర్శకత్వాన్ని వహించమని ప్రార్థిం చింది. పటేలు సోదరులు ఉద్యమాన్ని జయప్రదంగా నిర్వహించారు. గౌరవప్రదంగా దానిని ముగించిన గౌరవం వాస్తవానికి వారికి చెందవలసినదే. ఉత్సవంతీసేవారు అనుమతికై దరఖాస్తు పెట్టవలసి వున్నందుకు ప్రభుత్వం సంతృప్తిపడింది. ఏ రహదారినుంచైనా ఏమాత్రం అవరోధం లేకుండా పోయే హక్కువున్నదని కాంగ్రెసు వాదన. తీవ్రమైన ఉద్యమం ఉద్దేశించ బడింది. వల్లభభాయి అపోహాలన్నిటినీ పోగొట్టి ప్రజలకు నమ్మకం కలిగిం చాడు. మార్చి 18 న ఊరేగింపు తీసేమార్గాన్ని, సమయాన్నీ ప్రకటించాడు. నిషేధాజ్ఞ అట్లాగేవున్నది. అంతేకాదు, వాస్తవానికి అప్పుడప్పుడే అది పునరుజ్జీవింపబడింది. కాని పతాకోత్సవము పోనివ్వబడింది. తరువాత దీన్ని గురించి వాదోపవాదాలు బయలుదేరినవి కాంగ్రెసు అనుమతికై దరఖాస్తు పెట్టిందనీ, కాబట్టి విజయం ప్రభుత్వానిదేయనీ. అంగ్లో యిండియన్ పత్రి కలువ్యాఖ్యానించినై. తానెన్నడూ అట్లా చేయలేదని కాంగ్రెసూ, జాతీయ ఉద్యమ ప్రతికూలురు, ఈ ఒక్క సందర్భంలోనేకాదు, అనేక సందర్భా లలోగూడా ఒకసమాధానం కుదిరినప్పుడు తప్పుడు వ్యాఖ్యానాలు చేయడం

జరిగింది. నాగపూరు పతాక సత్యాగ్రహోద్యమ నిర్మాతకు వీరోచిత త్యాగాలను చేసి, బాధలను సహించి, విజయం లభ్యమయ్యేవరకు పోరాటం సాగించి దేశ గౌరవాన్ని కాపాడిన శాంతి సైనికులకూ, ఢిల్లీ కాంగ్రెసు హృదయపూర్వక ధన్యవాదాలను సమర్పించింది. ఈ విధంగా నాగపూరు పతాక సత్యాగ్రహోద్యమం ముగిసింది."

నాగపూరు పతాక సత్యాగ్రహం ఒకలాభకారియైన ప్రయోజనాన్ని సాధించింది. దీనివల్ల జండా అత్యద్భుతమైన ప్రజామోదాన్ని పొందింది. శాంతి సైనికులు సంతోషంగా పతాక గౌరవాన్ని నిలబెట్టేందుకు లోనైన బాధలు, చేసిన త్యాగాలు, దాని పవిత్రతను, ప్రజామోదాన్ని పెంపొందించింది కాంగ్రెసుకు వ్యతిరేకంగా వున్నవారుకూడా దానిని జాతీయ పతాకంగా అంగీకరించసాగారు. అధికమైతున్న దాని ప్రాముఖ్యతను గుర్తించి గాంధీజీ తన "యంగిండియాలో" యిలా వ్రాశారు:

"జాతీయ పతాకం ప్రాముఖ్యత గడించుకొంటున్నకొద్దీ దాని రంగులూ, సైజూ, (పరిమాణము) చరఖా చిహ్నమూ మొదలైనవాటిని గురించి లేవనెత్తబడుతూవున్న ప్రశ్నలు వాటంతట అవే పరిష్కారమైనవి. జాతీయ పతాకం ఆచారంవల్లనే జాతీయమైంది కాని, యే కాంగ్రెసు తీర్మానమువల్ల కాదని జ్ఞాపకముంచుకోవాలె జాగృతి అధికమైతున్నకొద్దీ నేను జండాలోని రంగులకిచ్చిన మత నిర్వచనానికి కాంగ్రెసు వాదులు అయిష్టత సూచించటం మొదలుపెట్టారు. ఒక విలేఖరి కొన్ని రోజులకు పూర్వం ఒక మహిళ ఆ రంగులకు నిర్వచించిన అర్థాన్ని నాకు పంపాడు, ఆమె ధైర్యానికి ఎరుపును, శాంతికి ఆకు పచ్చను, స్వచ్ఛతకు తెలుపును సూచించిందని నాకు జ్ఞాపకము నేను సూచించిన అర్థానికి బదులుగా దీన్ని

నేను అంగీకరించటానికి ఎట్టి అభ్యంతరమూ లేదు. జాతి పోరాటాలను పెంపొందించే శక్తులను సంతోష పరచటానికి తప్ప ఎందుకూ పనికి రాని కొన్ని విషయాలుంటవి. మనఃపూర్వకమైన ఐక్యతను పొందినప్పుడు వాటిని జ్ఞాపకం చేసుకోటానికి మనం సిగ్గుపడతామనటంలో సందేహములేదు. మనం నిజంగా ఐక్యమైనప్పుడు మన విభేదాలను జ్ఞాపకం చేసుకోవలసిన అవసరంలేదు. ఎంత తొందరగా వీలయితే అంత త్వరగా మరచిపోవాలని కోరుతాము. కాని మనమెప్పుడూ ధైర్యాన్నీ, శాంతాన్నీ, స్వచ్ఛతనూ పెంపొందించుకోవలసిన అవసరం వుంటుంది. రంగులను గురించిన అన్ని వివాదాలను ఈ క్రొత్త నిర్వచనం తొలగించగలదు. రాట్నానికి సంబంధించినంత వరకు మాత్రం యెవరికైనా అభ్యంతరం వున్నదనటం నాకు చాలా శోచనీయంగా వుంటుంది. రాట్నం అంటే నిరుపేదను ధనవంతుని బంధించే సూత్రమనీ అది కాంగ్రెసు వాదులను వారు చేసే ప్రతి పనిలోను ప్రజానీకాన్ని మరచిపో సాహసించవద్దని జ్ఞప్తిచేసేదనీ అర్థం."

గాంధీజీ వెంటనే క్రొత్త నిర్వచనాన్ని అంగీకరించినప్పటికీ కాంగ్రెసు వాదులు చాలామంది తమ ఉపన్యాసాలలోనూ, వ్రాతలలోనూ పాత నిర్వచనాన్నే యివ్వటం సాగించారు. మరొక అధికారపూర్వక నిర్వచనానికి బదులు తమ అంగీకారమయ్యే మరొక రంగును జండాలో చేర్చమని వారు కోరారు. పండిత జవాహరలాల్ నెహ్రూ అధ్యక్షతన లాహోరులో జరిగిన మహాసభలో వారు ఆ విషయం ప్రతిపాదించారు. కాని బ్రిటీషు దాస్య శృంఖలంనుంచి దేశాన్ని విముక్తం చేయటానికి కాంగ్రెసు ఒక గొప్ప ప్రజా ఉద్యమాన్ని తీయనున్నది కాబట్టి జండాను మార్చే విషయమైన ప్రశ్న తాత్కాలికంగా త్రోసివేయనైనది. పాత

జండాక్రిందనే స్వాతంత్ర్య యుద్ధం సాగించనైనది. 1930 సం॥ నాటి మహా సంగ్రామంలో మరొకసారి మన ప్రజలు పతాక గౌరవానికై పోరాడవలసివచ్చింది. అట్లా చేయడంలో అనేకమంది చంపబడ్డారు. వందలకొద్ది జీవితపర్యంతం వికలాంగులయ్యారు. వేల మంది తమ అస్తులను పోగొట్టుకొని కారాగారక్లేశ మనుభవించారు. అస్సాంలో జరిగిన సంఘటనను పండిత నెహూర్ తన "భారత దేశ ఐక్యత" అనే పుస్తకంలో వర్ణించాడు. దాన్ని ఇక్కడ పొందుపరచడం అవసరం:

"సిల్హెటులోగూడా పరిసర పర్వత ప్రాంతాలనుంచి చాలామంది నాగులు నాకు ధన్యవాదాలు, బహుమతులు యివ్వటానికి వచ్చారు. భారత దేశంలో, తెలుసుకొని నిరంతరం స్మరించవలసిన ఒక కథ వారివల్ల విన్నాను, నాగపర్వతాలల్లో కోబాయి తెగకు చెందిన అటవికుల్లోని ఒక యువతి కథ ఆమె పురోహిత తెగకు చెందింది. ఒక మిషను స్కూల్లో కొంత విద్య గడించటానికి ఆమెకు అమూల్యావకాశం లభించింది. ఆమె ఎనిమిదవ లేక తొమ్మిదవ తరగతివరకో చదువుకొన్నది. ఆమె పేరు గిండెల్లో. ఆరు సంవత్సరాలకు పూర్వం భారతదేశమంతట శాసనోల్లంఘనోద్యమము అల్లుకొన్న ఆ రోజులల్లో *ఆమె వయస్సు 18 సంవత్సరాలు. గాంధీ, కాంగ్రెసు వార్తలు పర్వతప్రాంతాలలో వున్న ఆమెకుకూడా చేరి హృదయంలో ప్రతిధ్వనించినవి. ఆమె తన ప్రజలకు కూడ హృదయ విదారకములైన బాధలు పోయి స్వాతంత్ర్యం సిద్ధించే కలలు కన్నది. స్వాతంత్ర్య ధ్వజాన్ని యెత్తి దానిచుట్టు చేరమని తన ప్రజలను ఉద్బోధించింది. ఆమె బహుశా బ్రిటీషు సామ్రాజ్యము

---

* జవాహరలాల్ నెహ్రూ 1936 సం॥లో అస్సాంలో పర్యటన చేసినప్పటి వృత్తాంతములు.

విచ్ఛిన్నమై పోతున్నదని ఆకాలంలోనే తలంచి వుండవచ్చు. కాని ఆ సామ్రాజ్యము యింకా బలంగాను దారుణంగాను పరిపాలన సాగిస్తూనే వున్నది. ఆమె మీదను, ఆమే ప్రజల మీదను ప్రతీకారం తీసుకున్నారు. చాలా గ్రామాలు తగులబెట్టి నాశనం చేయబడ్డవి. ఈ వీర బాలికను పట్టుకొని యావజ్జీవ ద్వీపాంతర శిక్షకు గురిచేశారు. ఆమె ఇప్పుడు అస్సాంలో యేదో ఖైదులో చీకటి కోణంలో యేకాంతవాసంలో తన ఉజ్వలమైన యవ్వన ప్రౌఢతను వ్యర్థపుచ్చుతూ వున్నది. ఆమె అక్కడ అరు సంవత్సరాలు వున్నది. ఆమెలో ప్రజ్వలిస్తూవున్న ఉత్సాహాన్ని దారుణంగ అణచివేశారు. ఆమె ఎంత మనఃక్లేశాన్ని, బాధను అనుభవించిందో! తన యవ్వన గర్వంలో సామ్రాజ్యాన్ని సవాలుచేసిన ఆ యువతి యిక వన్యసీమల్లోను, పర్వత ప్రాంతాలలోను విహరించటోదు. స్వచ్ఛమైన కొండ గాలిలో పాడుకుంటూ తిరుగలేదు. ఈ ఆటవిక బాలిక నిర్మానుష్యమైన నిర్బంధములో తన హృదయాగ్నిని దిగమ్రింగుతూ, చీకటిలో ముడుచుకొని కూర్చుండవచ్చు, మహా అయితే పగలు కొన్ని గజాలలో తిరుగుతూ వుండవచ్చు. ఇంత అయితే భారతదేశానికి ఈ సాహసోపేత అయిన పర్వత పుత్రికనుగురించిగానీ ఆమె సహజమైన స్వాతంత్ర్య ఆవేశాన్నిగురించిగానీ తెలియనే తెలియదు. కాని ఆ ప్రాంతపు ప్రజలు మాత్రం తమ గిండెల్లో రాణిని ప్రేమ పూర్వకంగాను సగర్వంగాను స్మరించుతూవుంటారు. భారతదేశం ఆమెను స్మరించి ఆదరించేటట్టి, ఆమెను కారాగారంనుంచి విడుదల చేసేటట్టి రోజుకూడా తప్పక వస్తుంది.

"నా నియమిత పర్యటన పూర్తి కావచ్చింది. అప్పుడు కారాగారంలో క్రుంగుతూవున్న గిండెల్లో రాణి నా తలంపుకు తట్టింది. నా

హృదయంలో చీకటి అలముకొన్నది. ఆమె భావాలు, విచారాలు, స్వప్నాలు ఏమిటో."

1930 సం॥లో శాసనోల్లంఘనోద్యమం, 1931 సం॥లో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక సంతకాలతో కొంత విజయాన్ని సాధించి, ముగిసింది. కాని జాతీయ పతాకంలోని రంగులనుగురించిన వివాదాలుమాత్రం ముగియ లేదు. సిక్కులు రంగులనుగురించిన సమస్యను తిరిగి 1931 సం॥లో జరిగిన కరాచీ కాంగ్రెసులో లేవనెత్తారు. దాన్ని యింకా పొడగింప వీలుకూడా లేకపోయింది.

సిక్కులు కోరిన ప్రకారం వివరాలను సేకరించి ఈ కాంగ్రెసు మహా సభలో అప్పటికప్పుడే పరిష్కరించటానికి వీలు లేకపోయింది. అందు కొరకై దీనిని కార్యసమితికి వదలివేసింది అ ప్రకారమే క్రొత్త కార్య సమితి కరాచీ హరిచంద్ నగరులో 1, 2, ఏప్రిల్ 1931 సం॥లో జరిగిన సమావేశంలో మత సంఘపరంగా అప్పటివరకు విశ్వసింపబడుతూవున్న రంగులను మార్చి కాంగ్రెసు అంగీకారానికి పెట్టడానికి, మరొక జండాను సిఫార్సు చేయుటానికి, ఒక ఉప సంఘాన్ని నియమించింది. ఆ కమిటీకి సాక్ష్యాన్ని తీసుకొని 1931 సం॥లో జూలై నెలకు పూర్వం నివేదిక పంపిం చాలని ఆదేశించింది.

x జాతీయ పతాక విచారణ సమితి నివేదిక ఆలోచింపబడి ఈ దిగువ విధంగా తీర్మానించబడింది. జాతీయ జండాలో పూర్వం ఉన్నట్లే మూడు రంగులు అడ్డంగా ఉండాలె. కాని కేసరి (నారింజపండు రంగు) తెలుపు అకుపచ్చ రంగులు వరుసగా వుండవలెను. రాట్నం తెలుపు

* డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెసు చరిత్రనుంచి.

భాగంలో ఉండవలెను. రంగులు మత సంఘాలకు ప్రాతినిధ్యం వహిం చక వాటి స్వభావానికే ప్రాతినిధ్యం వహిస్తవి. కేసరి వర్ణం ధైర్య త్యాగా లకు. తెలుపు శాంతి, సత్యాలకు. అకుపచ్చ విశ్వాసశౌర్యాలకు ప్రతిబిం బంగా వుంటవి. రాట్నం ప్రజానీకపు విశ్వాసానికి చిహ్నంగా వుంటుంది. పతాక పరిమాణం మూడు పొడవు రెండు వెడల్పు వుండవలెను. ఈ క్రొత్త జండా 30 అగష్టు నాడు ఎగుర వేయబడవలయుననీ, ఆ నెల చివరి ఆదివారం జండా దినంగా పరిగణింపబడవలెననీ తీర్మానించబడింది.

ఈ తీర్మానంతో జాతీయ పతాకపు రంగులనుగురించిన పెద్ద వివా దం సమసిపోయింది జండాలోని రంగులకు పూర్వం వున్న మత ప్రాతి నిధ్య నిర్వచనం అధికారపూర్వకంగా తొలగించబడింది. కాబట్టి సిక్కులు మరేమీ అభ్యంతరం పెట్టలేకపోయారు. ఈ విధంగా అఖిల భారత కాంగ్రెసు మహాసభ అధికారపూర్వకమైన తీర్మానంతో భారత దేశానికి నూతన చరిత్రలో ఒక విధమైన జాతీయ పతాకం లభించింది. అప్పటి నుంచి యిప్పటివరకు అది భారతదేశ జాతీయ పతాకంగా ఉపయోగింప బడుచున్నది."

జాతీయ పతాక ఉపసంఘ నిర్ణయాన్ని గాంధీజీ ఈ దిగువ విధంగా సమీక్షించారు:

"తెలుపు, అకుపచ్చ, ఎర్ర రంగులుగల త్రివర్ణ పతాకం ఎప్పుడూ అధికారపూర్వకంగా అవలంబింపబడియుండలేదు అది నాచేతమాత్రమే సృష్టించబడింది. నేను దానికి మతార్థం యిచ్చినమాట వాస్తవం అది మతైక్యతకు ప్రతిబింబమని నేను భావించాను. దీనికి సిక్కులు తమ అసమ్మతిని తెలుపుతూ వారి రంగుకూడా కోరారు. దానికి ఒక ఉప సంఘం నియమింపబడింది అది విలువైన సాక్ష్యాన్ని సేకరించి ఉపయో

గకరములైన సిఫార్సులను చేసింది. ప్రతి రంగుకూ యివ్వబడ్డ మతార్థాన్ని అధికారపూర్వకంగా తొలగించారు. ఇప్పుడు మనకొక పతాకం లభించింది. ఎరుపుకుబదులుగా కేసరి వర్ణం ఉంచబడింది. కళా దృష్టితో మాత్రమే ఇది మొదటి స్థానంలో వుంచబడింది. కేసరి ఆకు పచ్చలకు మధ్య పతాకం యావత్తూ కనుపించటానికి దృశ్యం యింకా హృద్యంగా వుండటానికి తెలుపు ఏర్పరచనైనది. తెలుపు భాగంలో నీలపు గీతలతో రాట్నం చిహ్నము సూచించనైనది. ఇది అభివృద్ధి అవ టానికి ఏమీ సందేహంలేదు. ప్రజా విశ్వాసానికి చిహ్నంగా రాట్నం వుంచబడింది. చాలా ముదావహము అది అవిరుద్ధంగానే మనకు దక్కి నైంది. ఎక్కడికి పోయినా అది దారిద్ర్యాన్ని నసింపజేసి సౌఖ్యాన్ని చేకూర్చింది జాతీయ పతాకపు అర్థాన్ని వివరించి చెప్పటం ఇప్పుడు ప్రతి కాంగ్రెసు సభ్యుని విధి ఇంతేకాకుండా మనం ఈ అర్థాన్ని మన జీవితాలకు అన్వయింపజేసుకుంటామని నేను విశ్వసిస్తున్నాను. మనం దాన్ని మన ప్రాణాలొడ్డి రక్షించుతామనడానికి ఏమీ సందేహం లేదు. కాని నిజమైన రక్షణ దాని రంగుల ప్రాతినిధ్యం వహించే విశిష్ట గుణ ములను అలవరచుకోటంలోను, రాట్నానికి ప్రతి యింట స్థానము యివ్వ టంలోను వున్నది. మనమిప్పుడు విదేశ వస్త్ర బహిష్కరణకై పికిటింగు చేయ నవసరం లేదు. మనము జండాకై మరణించేటట్లయితే ముందు మనము దానికై జీవించటము నేర్చుకోవాలె."

జండా పరిమాణం విషయములోనూ, వర్ణక్రమంలోనూ, వాటి అర్థం విషయములోనూ చరఖా ఉండవలసిన స్థానము విషయములోనూ ఇంత స్పష్టముగా ఆదేశం యిచ్చినప్పటికీ జాతీయపతాకముతో అనేకవిషయాలలో వ్యత్యాసంవున్న పతాకాలను తెలియకనో అలక్ష్యమువల్లనో చేసి, జాతీయ

పతాకాలుగా ఉపయోగించడము ఇప్పటికీ చూస్తున్నాము. కొంతమంది తమకు గాంధీజీ మీదగల భక్తి గౌరవాలకు చిహ్నంగా గాంధీజీ ప్రతిమను అందులో చిత్రించుతారు. పాపం నియమిత పద్ధతిలో నుండగపోవడమువల్ల జాతీయ పతాకము తన జాతీయ పవిత్రతను కోల్పోతుందని వీరికి తెలియదు. గాంధీజీ ఈ విషయములో ఈ దిగువ విధంగా చెప్పారు.

"జాతీయ పతాకము దాని నియమితమైన ప్రమాణములో సరిగా వుండకపోతే దాని విలువను కోల్పోతుంది. మనము కొనేటువంటి సామాన్య వస్తువుల విషయంలోగూడా పరిమాణము, ఆకారము, రంగు మొదలైన వాటిలో అత్యంత సంతృప్తిని కోరుతాము. అటువంటప్పుడు మనము చావు బ్రతుకులు కూడా లెక్కచేయమని ప్రమాణం చేసిన పతాకము విషయములో ఎంత జాగ్రత్తగా వుండాలి! జాతీయ పతాకము అంటే ఒక జాతి ఆత్మ గౌరవానికీ, ప్రతిష్ఠకూ, దాని ఆదర్శాలకూ, అభీష్టాలకూ చిహ్నం. కాబట్టి నాణాల వలె అది సులభముగా గుర్తింపబడునదిగా వుండవలెను. నియమితమైన విధానాన్ని తూచా తప్పకుండా అనుసరించటమువల్లనే మనము కోరిన పవిత్రత దానికి సిద్ధిస్తుంది. అశ్రద్ధగాను అశుభ్రముగాను చేయబడ్డ జండా నుపయోగించటమువల్ల మన జాతీయ గౌరవము మొక్కపోతుందనే భావన మనకు కలగాలె జాతీయ పతాకము అంటే కలిగే గాఢమైన పూజ్య భావం ఏదోవిధముగా రంగు అద్దిన గుడ్డపేలికపై వుండమంటే ఎట్లా వుంటుంది?

ఈ జండాను దురుపయోగపరచడాన్నిగురించి గాంధీజీ ఈ దిగువ చేసిన విమర్శ చదవటానికి చాల అభిరుచి కలిగిస్తున్నది.

"జాతీయ పతాక భావానికి, దాని ప్రస్తుత స్వరూపానికి రచయితగా అది హింసను కప్పిపుచ్చటానికి ఎట్లా ఉపయోగింపబడుతున్నదో చూచి

వప్పుడు నాకు చాలా విచారము కల్గుతున్నది. నిజమైన మన ఐక్యత ద్వారా ఏర్పరచబడ్డట్టిన్నీ, అత్యధికమైన నిమ్నోన్నతలు సులభంగా అవలంబించబడ్డ పరిశ్రమద్వారానూ విపరింపబడ్డ అహింసకు పతాక స్వరూపం ప్రాతినిధ్యం వహిస్తుంది. ఇంతేకాకుండా అది అహింసకు చిహ్నమైతే వినమ్రతకు కూడా చిహ్నమని అర్థం. కాంగ్రెసుకు సంబంధించని సమావేశాలలో దీన్ని ఉపయోగించడంలో చాలా జాగ్రత్త వహించవలెను. ఏ ఒక్కరు అభ్యంతరము సూచించినా పతాక ప్రతిష్ఠ తక్కువవుతుంది అటువంటిదానికి అవకాశాన్ని ఇవ్వకుండావుండటం మంచిది. మనము ఉద్యాపనము చెప్పదలచుకున్న శక్తికి భయపడి జండాను దింపితే దాని గౌరవం పడిపోతుంది. మనకు పూర్తి సామరస్యతలోను రాష్ట్రంలోను అచంచలమైన విశ్వాసము లేకపోతే దాన్ని మూవేళాలల్లోనూ కాంగ్రెసు కార్యాలయాలపైననూ ప్రతిష్ఠించి ప్రదర్శించనందువల్ల దాని గౌరవము మరీ పడిపోతుంది. ఈ జండా పౌర చిహ్నంకాదు కాబట్టి మత సంబంధమైన ఊరేగింపులలోను, దేవాలయాలలోను ధార్మిక సభలలోను దీనికి స్థానం లేదు. ప్రతి వస్తువుకూ దాని స్థానం లో అది వున్నప్పుడే విలువ. దాని స్థానంలో అది లేకపోతే విలువలేదు"

డాక్టర్ యన్. యస్. హార్డికరుగారి అలసట జెందని ప్రయత్న ఫలితంగా హిందూస్థాన్ సేవాదళమనే ఒక స్వచ్ఛంద సేవాదళ సంస్థ ప్రారంభమైంది. తరువాత కాంగ్రెసు కేంద్ర వాలంటీర్ల దళంగా అది అంగీకరించబడింది. అది ప్రతి నెలా జాతీయ పతాకోత్సవము ఏర్పాటు చేయడములో అనుకున్నదానికంటే ఎక్కువ విజయము పొందింది. ప్రతి నెల చివరివారము ఉదయము 8 గంటలకు జండా ఎగురవేయవలెననే నిర్ణయమువల్ల 1928 సం॥లో కలకత్తా కాంగ్రెసు నిర్ణయంవల్ల

ఈ ఆచారం త్వరితంగా ప్రజామోదాన్ని పొందింది. అనేకమంది ప్రజలు, మునిసిపాలిటీలు తమతమ భవనాలపైన పవిత్రంగా పీటిని ఎగుర వేస్తుండేవారు. 1930, 1931, 1932, 1933, 1942, 1943, సంవత్సర ములలోను పోలీసులు ఈ ఉత్సవాన్ని అత్యంతరపరచటమువల్ల పవిత్ర పతాక సంరక్షణార్థం మన ప్రజ అనేకమంది పురుషులూ స్త్రీలూ లాఠీ ఛార్జీలకు శిక్షలకు గురికావలసివచ్చింది ఈవిధంగా భారత ప్రజాపీకం తమ ఆశయాలకూ ఆకాంక్షలకూ ప్రతిబింబంగా కల్పించు కొన్న జాతీయ పతాకం దేశంస్వాతంత్ర్యం బడయడంతో ప్రభుత్వ పీఠం అలంకరించింది. అయితే స్వాతంత్ర్యయుద్ధంలో పతాక మధ్యన గల రాట్నానికి బదులుగా అశోక చక్రాన్ని ఈ నూతన పతాకంలో ఇమిడ్చారు. ఈవిధంగా మార్చడానికి కారణం త్రివర్ణపతాకం అధికారపూర్వకంగా జాతీయపతాకం కావడంతో కొన్ని లాంఛనాలకు గురికావలసి వచ్చింది స్వాతంత్ర స్వతంత్రమైన భారతదేశ చిహ్నంగా అది ప్రభుత్వ భవనాలమీద, భారతీయ నౌకలమీద ఎగురవలసివుంటుంది. ఆ సందర్భంలో బండా గుడ్డకు రెండు పైపులా వ్యత్యాసం లేకుండా ఒకే చిహ్నం కనిపించ వలసివుంటుంది. రాట్నంలో గీతలుండడంవల్ల ఒకవైపు ఒకవిధంగానూ, రెండోవైపు మరోవిధంగానూ కనిపించక తప్పదు. ఆ విధంగా కనిపించడం పతాక సాంప్రదాయానికి విరుద్ధం. అందుకని-రాట్నానికే కాక భారతజాతి సాంప్రదాయానికి అనుశ్రుతమైన చిహ్నంగా వుండేలా పతాక మధ్యన అశోక ధర్మ చక్రం ఉండవలెనని నిర్ణయించారు.

అశోకుడు భారతదేశం నుంచి ప్రపంచమంతటా అహింసా సిద్ధాం తాన్ని వ్యాపింపజేస్తూ తన ఉద్యమానికి ప్రతిబింబంగా ఈ ధర్మ ప్రవర్తక

చక్రాన్ని సృష్టించాడు. ఈ చిహ్నం పతాక మధ్యంలో వుండడం మన సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రతిబింబంగా గానిస్తుంది.

ఈ పతాకాన్ని భారత రాజ్యాంగ రచనా పరిషత్తు 1947 జులై 22వ తేది సమావేశంలో అంగీకరించగా 1947 ఆగస్టు 15వ తేదీన స్వతంత్ర్యాపితరణ సుసమయంలో రాజ్యాంగ రచనా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ రాజేంద్ర ప్రసాద్ ద్వారా ప్రధాన మంత్రి శ్రీ నెహూర్ దీన్ని దేశానికి ప్రసాదించారు. అప్పటి నుండి ఇది అధికార పూర్వకంగా భారత జాతీయ పతాక మైంది

పూర్వంలాగే రాట్నపు చిహ్నంతోగల పతాకాన్ని భారత జాతీయ కాంగ్రెస్ ఆ సంస్థకు సంబంధించిన ప్రత్యేక పతాకంగా ఉపయోగించు కొంటున్నది.

# జాతీయ పతాకం:
# గమనించవలసిన విషయాలు



ప్రతి స్వతంత్రదేశమూ, జాతీ, తన ప్రాణప్రదమయిన. పతాకం విషయంలో, చాలా ఖచ్చితమయిన నియమాలను, ఏర్పరచుకొని, అనుసరిస్తుంది. చూపించవలసిన గౌరవాన్ని, అనుసరించవలసిన మర్యాదలను తు చ. తప్పకుండా పాటిస్తుంది. మనదేశంలోనూ ప్రభుత్వోద్యోగులూ ప్రజా సంస్థలో, వ్యక్తులూ విద్యార్థులూ, పతాక సంప్రదాయాలను శ్రద్ధగా పాటించటం కర్తవ్యం.

-: ముఖ్యంగా ఈ క్రిందివి గమనార్హములు :-

1. పతాకము మూడు పొడవు రెండు వెడల్పు నిష్పత్తిలో ఉండవలెను.

2. అడ్డముగా సమనిష్పత్తిలో కేసరి, తెలుపు, ముదురు ఆకుపచ్చ రంగులు వుండవలెను.

3 పతాకమును విధిగా ఎగురవేసే ప్రత్యేకదినములలో ఉదయమునుండి మధ్యాహ్నమువరకు, ధ్వజ మధ్యమునకు- మధ్యాహ్నం నుంచి సాయంత్రం ధ్వజాగ్రంలోను పతాకం ఎగరవేయవలెను.

4. సంతాపమును సూచించవలసిన సందర్భములలో, పతాకమును ధ్వజ మధ్యమునకు దించవలెను.

5. ధ్వజ మధ్య అనగా ధ్వజ దండ (జెండాకర్ర) చివరకును. త్రాళ్లు ముడివేయు ప్రదేశమునకును మధ్య అని గమనించవలెను.

6. కేసరి వర్ణము పైన ఉండులాగున జెండాను కట్టవలెను.

7. బహిరంగ సభలలో, వేదికపైన జెండాకట్టు సందర్భాలలో ఉపన్యాసకుని కుడిప్రక్కన జెండా ఉండవలెను. జెండా ఉపన్యాసకుని వెనుక ఎగురు నట్లు ఎగురవేయవలెను.

8. వీధులలో అడ్డముగా వ్రేలాడగట్టిన సందర్భములలో, పతాకమును నిలువుగా వ్రేలాడ గట్టవలెను. తూర్పు, పడమర వీధులందు కేసరి వర్ణము ఉత్తరదిశన, ఉత్తర దక్షిణ వీధులలో, తూర్పునకు ఉండు లాగున కట్టవలెను.

9. పతాకమునకు అమర్యాద కలుగు ఎట్టిపనిని చేయరాదు. పతాక వస్త్రము జీర్ణమయినచో, పారవేయుటగాని, ఇతరత్రా పనికి వాడుటగాని కూడదు. దానిని దహనము చేయవలెను. లేదా మరొక లాగున భక్తి పూర్వకంగా విసర్జించవలెను.

10. పతాకమును ఎగురవేయు సమయములో అందరును నిశ్శబ్దంగా, పతాకమువైపు సావధానంగా నిలుచొని వందనము చేయవలెను. పతాకము ఎగురవేయగనే, జాతీయ గీతమును ఆలాపించవలెను.

-: పతాకముపట్ల చూపించ వలసిన మర్యాదలు :-

1. పతాకము సూర్యాస్తమయ సమయములో దించివేయవలెను.

2. ధ్వజ దండమునకు తుదినగాక మధ్యన పతాకము ఎగురునట్లుగా కట్టదలిస్తే ఎగురవేసేటప్పుడు, దింపేటప్పుడు, ధ్వజ దండము చివరన ఒక క్షణము ఎగుర నియవలెను.

3. తెలుపురంగు మధ్య భాగమున, అశోక చక్రం ఉండవలెను. ఈ చక్రములో 24 మొనలు ఉండవలెను. చక్రము ఊదారంగు (నావీబ్లూ) ఉండవలెను.

4. జెండా చేతితో వడికి చేతితో నేయబడిన నూలు (ఖద్దరు,) పట్టు, లేదా, ఉన్నిబట్టలను మాత్రమే ప్రయోగించవలెను.

5. ఇండియన్ స్టాండర్డ్సు ఇన్స్టిట్యూటువారి వద్దగల నమూనాను బోలి పతాకం ఉండవలెను

-: ధ్వజారోహణ, విద్యార్థులు గమనించవలసిన విషయములు :-

1. ధ్వజారోహణ ప్రదేశమును సమచతురాకారములో నేర్పరచ వలెను.

2 మూడు భుజములలో విద్యార్థులు పంక్తులను ఏర్పరచుకొని నిలుచుండ వలెను. నాల్గవ భుజమధ్యంలో ధ్వజముండ వలెను ధ్వజమునకు సుమారు మూడు అంగలు వెనుక, ప్రధానోపాధ్యాయుడు, విద్యార్థి నాయకుడు, పతాకావిష్కర్త వేరే ఉన్నచో ఆయన నిలువబడవలెను. విద్యార్థుల పంక్తులమధ్య ఒక అంగ (సుమారు ముప్పది అంగుళముల) ఎడముండవలెను

3. ప్రతి తరగతి తననిర్ణీత ప్రదేశమున చేరగానే ఆ తరగతి విద్యార్థి నాయకుడు ముందుకు అడుగువేసి విద్యాలయ విద్యార్థి నాయకునకు నమస్కరించవలెను. ఇట్లు అన్నితరగతుల నాయకులు నమస్కరించగానే విద్యాలయ విద్యార్థి నాయకుడు ప్రధానోపాధ్యాయుని ముందుకువచ్చి నమస్కరించవలయును. పతాకావిష్కర్త వేరుగావుంటే ప్రధానోపాధ్యాయుడు ముందుకు వచ్చి ఆయనకు నమస్కరించును. ప్రతి నమస్కారము తర్వాత పతాకావిష్కరణ జరుగును.

4. ప్రతి తరగతి విద్యార్థి నాయకుడు తన తరగతి మొదటి వరుసలో, కుడి చివరలో నిలువ వలెను. తరగతి ఉపాధ్యాయుడు తన

తరగతి చివర వరుసకు వెనుకగా మూడు అంగల దూరమున మధ్యన నిలువ వలెను.

5 విద్యాలయ విద్యార్థి నాయకుడు పతాకావిష్కరణ ముందు సావధానముగా నుండుటకై హెచ్చరించుటకు "పరాక్" అని హెచ్చరించును. అందరును చక్కగా సైనిక పద్ధతిలో నిలువవలెను. పతాకము ముడి విడివడగానే నమస్కార్ లేక వందన్ అని హెచ్చరించును. అందరును కుడి చేతితో నమస్కరించవలెను. అట్లు కొద్ది క్షణములు కాగానే, తిరిగి పరాక్ హెచ్చరిక చేయగానే తిరిగి, చక్కగా నిలుచుండవలెను.

6. పతాకావిష్కరణ వెంటనే జాతీయ గీతము పాడవలెను.



# జండాగీతం

ధ్రువ తారవై వెలుగుమా - కేతనమా
ధ్రువతారవై వెలుగుమా ॥

1. సూర్య చంద్రులు సృష్టి - తేజరిల్లినటుల
ఆకాశవీధి మా - ఆదర్శ చిహ్నమై ॥ ధ్రువ ॥

2. స్వాతంత్ర్య సిద్ధికై - జనత బలిదానముగా
జాతిమహదాశయము - స్ఫురియింపజేయుచును ॥ ధ్రువ ॥

3 వీరులు హర్షింప - శూరులు పులకింప
శాంతికాముల నిత్య - స్మరణజేయుచునుండ ॥ ధ్రువ ॥

4. త్యాగ స్వచ్ఛత ధైర్య - స్థైర్య ప్రతాపముల్
జాతి యలవరచుకొని - జగతి ప్రకాశింప ॥ ధ్రువ ॥

5. చిగురించు ఆశలకు - చేవగలిగించుచును
చేయవలసిన కృషిని - స్మరణకున్ దెచ్చుచు ॥ ధ్రువ ॥

6. జగతికి గాంధీజీ - చూపిపోయిన త్రోవ
అడుగు దప్పక మమ్ము - అనుసరింపగ జేయ ॥ ధ్రువ ॥

7. నీమూడు రంగులు - నీధర్మ చక్రము
నిఖిల పీడిత ప్రజను - నిజ ముక్తిని జూప ॥ ధ్రువ ॥

—కోదాటి నారాయణరావు

# జనపద ప్రచురణలు

1—8—452, చిక్కడపల్లి

హైదరాబాదు-1.

| | | | |
|---|---|---|---|
| తెలంగాణా తీరుతెన్నులు | [లేఖలు] | 'భవదీయుడు' | 1-0-0 |
| గెలుపునీదే | [నాటకం] | కె. యల్. నరసింహారావు | 1-0-0 |
| ఒకరోజు | [నాటిక] | కె. యల్. నరసింహారావు | 1-0-0 |
| గండివద్ద జీవితాలు | [కథలు] | పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి | 0-10-0 |
| కృష్ణారావు కథలు | [1వ సంపుటి] | 'భాస్కరభట్ల' | 0-12-0 |



సర్వోదయ ప్రెస్, మహంకాళివీధి, సికింద్రాబాదు.